# ANDHRA BASHA SARVASVARHA NIYAMA KATIPAYAMULU.

BY

VEDAM VENKATARAYA SASTRY



VEDAM VENKATARAYA SASTRY & BROS
No. 4, Mallikeswarar Koil South Lane,
LINGHI CHETTY STREET, G. T., MADRAS.
1948

# ఉ పో ద్ఘా త ము

ఈనియమకతిపయములను శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రులవారు తాము నిఘంటుసంపాదకులైన కాలమునరచించి ప్రకటించిరి. కాఆలమున ననేకులు నిఘంటు నిర్మాణపద్ధతిని గుఱించి వ్యాసములువ్రాసియుండిరి. ఆపద్ధతులపై తమ యభిప్రాయముగా శాస్త్రులవా రీపుస్తకమును ప్రకటించిరి.

సూర్యరాయాంధ్ర నిఘంటు సంపాదకత్వము శాస్త్రులవారి జీవితమున నొకవిషాదఘట్టము. శాస్త్రులవారార్థిక క్లేశములలోనుండి, శ్రీ వేంకటగిరిమహారాజా శ్రీ రాజగోపాలకృష్ణ యాచేంద్రబహద్దరువారి సాయమపేక్షించుచుండిన కాలమున, శ్రీ రాజాగారి సాయముతోపాటు ఈసంపాదనాధికారము శాస్త్రులవారికి వాడినచేనికి వర్షమైనది. శ్రీయుత గుమ్ముడూరి వేంకటరంగరావు పంతులవారు శాస్త్రులవారిని పలుమార్లు హెచ్చరించిరి. శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావుగారు నిఘంటుసంపాదకత్వము వహింపవలసినదని శాస్త్రులవారికి లెక్కలేని జాబులువ్రాసిరి. పరిషత్తువారును ఈనిఘంటువునకు శాస్త్రులవారే ప్రధానసంపాదకులుగా నుండవలయుననికోరిరి. ప్రతిష్ఠాపకులలో నొకరైన శ్రీ వేంకటగిరిమహారాజావారు శాస్త్రులవారుతప్ప నితరులాపదవి కనర్హులని తమయభిప్రాయముం దెలిపి వారే సంపాదకులుగా నుండవలయు ననిరి. అంతట శాస్త్రులవారు నెలకు రు. 250 వేతనముపై నిఘంటు సంపాదకత్వమును 1915 సం. డిసంబరులో వహించిరి.

శాస్త్రులవారు రెండేండ్లు సంపాదకులుగా మదరాసులో పనిచేసిరి. కాని పరిషత్కార్యస్థానమున వారికేర్పడిన సంవిధానములు శీఘ్రీకరణమునకు ప్రతికూలములుగా నుండినవి. పరిషత్తువారు వారికి సహాయులను సరిగా-ఈయకయు, చేయుచున్న పనిలో స్వాతంత్ర్యము లేకుండునట్లు, 'ఆపనిచేయవలయును ఈ పనిచేయరాద'ని మాటిమాటికి అడ్డుతగులుచునుండిరి. శాస్త్రులవారే తమనివేదికయం దిట్లువ్రాసిరి. "ఆతఁడు (సంపాదకుఁడు=తామే) ఎప్పుడును నిఘంటుపని త్వరలో ముగియు నుపాయములను పన్నుచుండెను. వానిని వేనిని సభవారు కైకొనక వానికి బదులుగా ధనమును మంచికాలమును పాడుసేయునవైన యసాధ్యాసంభావ్యోద్యమములను కల్పించుచుండిరి...సాధుత్వమునకును ప్రామాణికత్వమునకును వలసినంత యాదరమును సభవారు వహింపలేదని సంపాదకుఁ డభిప్రాయపడుచున్నాఁడు. ...నిఘంటుసభ కార్యసాధకముగాదు."

"నిఘంటుసభా సమ్మేళకులయిన శ్రీయుత గుమ్ముడూరి వేంకటరంగరావు ఎమ్. ఏ, గారు, 1924 సం. లో మదరాసులోను, 1915 సం, లో, నెల్లూరిలోను, నాతో "మీరు ఏతన్నిఘంటుసంపాదనాధికారమును వహింపవలయునని పరిషత్తువారి యభిమతము; దానిని మీరు నెఱవేర్చిన ఆంధ్రలోకమునకు ఉపకారమును మీకు కీర్తియును గలుగును; కావున మీరీయధికారము నంగీకరింపఁదగును." అని బోధించిరి. వెంటనే నెల్లూ

రిలో మదరాసులోని యొకానొక పరిషత్సభ్యుని బంధుమిత్రుల వలననుండి పారంపరీణముగా "ఈయధికారమున ఈయనను రెండు సంవత్సరములే యుంతురు, అప్పటికీ ఫలానివారలు రాజకీయోద్యోగవిరతులై స్వయముగానే దీనిం బూనుదురు." అని యొక కింవదంతి కలిగినది. అనంతరము నేను మదరాసులో వేంకటరంగరావుగారిని దర్శించి ఆకింవదంతిని నివేదించి "ఏమట్లు జరుగునా? అట్లేజరుగునేని, ఈయుద్యోగంపు జీతముపాటి యాయతిని నాకొసంగందగిన ముద్రాశాలా వ్యాపారమును దీనికై మానుకొని ఇది విరమించినంతట నిరాధారుఁడనగుదు నే!" అని యడుగఁగా, వారు "నేను సమ్మేళకుఁడనుగా నుండఁగా అట్లు జరుగనేరదు." అని వాక్రుచ్చిరి. ఆమాటపై ఈపనిని 5 ఏండ్ల నియోజనమును, 2 ఏండ్ల కనంతరము ఇరుపక్షములను 3 నెలల హెచ్చరికచే విరామనియమనమునను, గైకొంటిని. ఆ రెండేండ్లునయినవి, కింవదంతియు నొకవిధముగా నెఱవేఱినది."

నిఘంటు సంపాదకత్వ మీవిధముగా తేలిపోయినది.

# శ్రీమత్

## పీఠికాపుర మండలేశ్వర ప్రవర్తితనిర్మాణాంధ్రభాషాసర్వస్వాభిధాన మహాభిధాన సముచిత నియమ కతిపయములు.

### 1. శబ్ద సిద్ధి యెట్లు?

1. శబ్దసిద్ధి లోకంబువలన. లోకము అనన్యాదృశంబును నిత్యంబును.

2. ఈ నిఘంటువులో గ్రామ్యరూపములు అనావశ్యకములు.

కొన్ని శబ్దాకరములు:—

3. ఇప్పటికిం గల యాంధ్ర గీర్వాణాది నిఘంటువులు

4. వేద, తర్క, వ్యాకరణ, పూర్వమీమాంసా, మంత్రశాస్త్రాది సంకేతములు ఇందు అప్రసక్తము లని త్యజింపు మనువా రుందు రేనియు—

5. వేదాంత, గణిత, జ్యోతిష, వైద్య, నీతి, శ్రౌతకల్ప, స్మార్తకల్ప, ధర్మశాస్త్ర, యోగ, సాంఖ్య, సంగీత, నాట్య, నృత్య, శిల్ప, వ్యాయామ, చ్ఛందోఽలంకా, రాగ, మార్ధశాస్త్రాది సంకేతాదికములను ఈ నిఘంటువున గ్రహింపవలయు.

6. పాశ్చాత్య కళా సంకేతాంధ్రపదములను నిఘంట్వంతమందు అనుబంధముగా ప్రదర్శింప నగు. అప్పటికి అవి బహుళతరములుగా సమకూడును.

7. శాసనములను సమగ్రముగా సంపాదించి పఠింపవలయును. అందువలన భాష నానాంటికి మాఱినవిధము తెల్ల మగును, పెక్కుశబ్దములకు వ్యుత్పత్తియుం దెలియును, అపూర్వపదములుం దొరకును.

8. నన్నయ్యకు పూర్వము వని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారిచే ప్రకటితము లగుచున్న రసవత్తర ప్రబంధములును శాసనములవంటివే; అవియుం అవశ్యపఠనీయములు.

9. గ్రామనామములను వివరించినవాఁడే సర్వజ్ఞుఁడు.

10 నిఘంటువులలో లేనివై కావ్యాదులం గలయట్టివి, (సమాసములు సైతము) వివరణీయములు.

"మనకు నిజమయ్యె నల చందమామ ఘుటిక." భీ. పు.—

"సంబెరంబిచ్చె" హరవిలాసము.

"గమ్మత్తు"=ఆనందము.

"గమ్మత్తు చిమ్మ నొకకథ
క్రమ్మఱఁ జెప్పెదను వేణీ గ్రమ్మువిరులపైఁ
దుమ్మెదలు జుమ్ము జుమ్మనఁ
గొమ్మా తల యూఁచి మెచ్చుకొమ్మా నన్నున్." హం. విం.

"లంబాడి"- శబర. ప్రథమముద్రణములో తండా శబ్దార్థమం దున్నది ; మూలపదములలో లేదు.

11. ఇట్లే సంస్కృత నిఘంటువులలో లేనివై సంస్కృత ప్రబంధంబులం దుండునవి. ఈ క్రింది రెండు సంస్కృతభారతములో నున్నవి. —

"కిలాసము"=శోల. "ప్రవేకము"=సురియ.

వలలుఁడు విరటునికొల్వుఁ జొచ్చినవిధము:—

"కిలాస మాలమ్బ్య కరేణ చాయసం
సశృఙ్గవే రార్ద్రక భూస్తృణాఙ్కురమ్"
"అసి ప్రవేకే ప్రతిముచ్య శాణితే"

ఇందులకు తిక్కనయాంధ్రము:—

"దాపలిచేతియందు। బెడిదంపుఁ గోలయుం బెడఁగొంద"

"చట్టువంబొకచేతఁ బట్టి ఖడ్గము సంకఁ
దగిలించి సు రి య తో బిగియ (దిండుఁ గట్టిన)"

12. వేఱువేఱు జిల్లాలయందు వ్యవహరింపఁబడు దేశ్యాదులు.—
వస్నారు, వతను, కెరటము, పిక్కలు (గింజలు), (ఒక్క) పిసరు, జెల్ల (పిల్ల), జెల్లకొట్టుట, ఓణీ, ఖండువా (హిం)

13. వేఱువేఱు జిల్లాలయందలి వృత్తిసంబంధి పదములు.

14. సామెతలు, వాక్యములు, సమస్తపదములును అర్థవిశేషము గలవి వివరణీయములు.—వీఁడేమి రాజా రెడ్డా? రెడ్డి వచ్చె మొదలాట.
వేసినాఁడు, నామము వేసినాఁడు, సింగినాదము జీలకఱ్ఱ, ఆఁడు మళయాళము, జేనికీనుఁగు, ముసుఁగులో గ్రుద్దులాట, సింగినాదము పంగలగుంజ, దేవరన్యాయము, రేవుతాళము, వీఁపుదోసె, వెన్నట్టు (వెన్న+అట్టు-గాదు), తోడపాయసము, తోడమామిడిపండు, అఱవచాకిరి [ఇది మదరాసులో ప్రత్యక్షము; ఈపని తెనుఁగువాఁడు చేయఁడు, ఇది చేయం నఱవవానికి ఒకయరయణా ఎక్కువ ఈయవలయును.] కుయ్యోమొఱ్ఱో, ముందున్నదిరా ముసళ్లపండుగు, స్వకపోలకల్పితము [స్వయముగా వెక్కిరించినది-అని నిందార్థమున నివ్వన్నము-ఇప్పటి స్వతంత్రులచే స్వవిరచిత మను నర్థమున ప్రయోగింపఁబడుచున్నది.]

15. కొన్ని మనుష్యాది నామములకు అర్థవ్యుత్పత్తుల నరయవలయు-
ఉ. ఎల్లమంద, పల్లాలు, తుర్రార్కన, పళ్లయ్య,

16. శిశుభాష—బాబూ బువ్వ తిన్నావా? బొబ్బ తాగినావా? బాయి తాగు; దా దా దా అప్పచ్చికొండా; చందమామా దావే.

17. కుక్కకు పిలుపు దో దో; కోడికి బో బో; కాకికి హా హా; పిల్లకి చీలీ పిస్‌పిస్; కుక్కను ఇసుకొల్పుటకు ఇసుకో, ఇస్కో.

18. గ్రామ్యము లని తెలుపుట కేనియు విచ్ఛిత్తివిశేషముంబట్టి యేనియు, కొన్ని గ్రామ్యములను, వాక్యములనుం గూడ, గ్రహింప వలయును. ఉ. "తస్సాగొయ్యా" (తల్లిసిగ గొయ్యను); (మీకోసము బెండ గింజలు) "శెట్టించాను" (తీసిపెట్టించితిని).

19. ఇట్లే అన్యభాషా పద ఘటిత వాక్యములును.- ఉ. వానికి 'దేవా దేవేషు' అయినది; వీనికి 'యద్దేవా' పట్టింతము. ఇందులకు శ్రుతి- "దేవా దేవేషు శ్రయధ్వమ్." "య ద్దేవా దేవహేడనమ్."

20. పరిభాషాపదములు.—'మెడసన్నం గోవిందరాజులు.'

21. శిష్టవ్యాహారాగోచరము లైనను అస్ఫుట గ్రామ్యత్వములు.— ఉడాయించు (ఉడ్డయతే), బజాయించు, జమాయించు, బుకాయించు, సతాయించు, దబాయించు, చపాయించు, ఉజ్జాయించు, సమదాయించు, పస్తాయించు, తమాయించు, గదమాయించు, మెదాయించు, జుమలాయించు, ఫోక్తాయించు.

22. ఇతిహాస పురాణ చారిత్ర భువనకోశాది గత స్త్రీపురుష స్థలాది నామములు తత్సంబంధి విషయవివరణములును ఇం దుండవలయును.

---

## II. భాషాభాగాదిప్రదర్శనము.

1. నిఘంటువులో తత్సమ తద్భవ సంజ్ఞా గ్రహణపూర్వక విభజనము సరిపడదు. ప్రాకృతసమతయు ప్రాకృతభవతయు ప్రాకృతములందు అతినదీష్ణులు కానివారికి గోచరింపవు. కావున సంస్కృతసమము, వైకృతము, అను బ. సీ. కృతభేదమే సరి. పైగా, సంస్కృత సమములం గల్పించుకొనునట్లు సంస్కృతభవ ప్రాకృతసమ ప్రాకృతభవములను కల్పించుకొనుమర్యాద లేదు. కాన ఆయొక్కటిని వేఱుగాను ఈమూటిని వేఱుగాను సంకేతించుట ఇట సప్రయోజనము.

2. దేశ్యముక్రింద ఆంధ్రదేశ్యాన్యదేశ్య భేదములు స్ఫుటీకరింపవలయును.
3. గ్రహించిన గ్రామ్యముల గ్రామ్యతం తెలుపవలయును.
4. అనౌపవిభక్తిక మనుభ్రమ జనింప కుండునట్లుగా ఔపవిభక్తికములను సూచింపవలయును. ఉ. నగరు, తేరు, చవలు, పేరు.
5. కొన్నిసమయములందు ఔపవిభక్తికము రానందులకు కారణము చెప్పవలయును.- వినుమాసికము, మిన్నేఱు, పలుగాటు, కాలుబలము.-
6. సందిగ్ధౌపవిభక్తికములంగూర్చి సిద్ధాంతముం దెలుపవలయు.-
ఉ. అక్కడికి, ఒద్దికి, అందటికి, పదుగురికి.
7. నామధాతువులను తెలుపవలయు. ఉ. అందగించు, పంతగించు, కోపగించు, నుతించు, స్తుతించు.
8. గణమును సూచింపవలయును. ఉ. బల్లిదావి, మగాది.
9. విశేష్యములను, విశేషణములను, సర్వనామములను, క్రియలను, శబ్దపల్లవములను, అవ్యయములను, వీని యవాంతరభేదములను, సంస్కృత శబ్దములకు అంతమును లింగములను సూచింపవలయును.
10. ద్రుతప్రకృతికములను సూచింపవలయు.

---

## III. తత్సమము.

1. ఇందు సంస్కృతసమమందు అనేకశబ్దములు వ్రాతలో మూలమునకు సంపూర్ణముగా సమములు గాకయున్నవి. తెలివిడి-
2. ఇందు పరసవర్ణానునాసికమునకు మాఱుగా అనుస్వారము వ్రాయఁబడుచున్నది. అందులకు ప్రాససామ్యము కారణముగా నున్నది.

" సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుపై నుండి మా
తంగ స్ఫూర్జిత యూథ దర్శన సముద్యత్క్రోధమై వచ్చునో

జం గాంతార నివాస ఖిన్న మతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిఁ."

ఇందు 'సింగముతో' ప్రాససామ్యమునకై 'మాతంగ' అని సున్న వ్రాయఁ బడినది.

3. ప్రాససామ్యార్థమైన యీమార్పునకు వైకృతమందు పరుషసరళములకు పూర్వము ఏకపదమందు బిందువే యుండుట కారణమైనది.

4. అందు బిందువే యుండుట ప్రాకృతమున ఙఞణనమల స్థానమునఁ గలుగు బిందువుయొక్క మర్యాదను ప్రాకృతసమ ప్రాకృతభవ శబ్దములందు ననుసరించుటగా నున్నది.—

"మోఽనుస్వారః" '(క్వచి దన న్త్యస్యాపి' అని వృత్తి),
"ఙఞణనో వ్యఞ్జనే" అని, హేమచంద్ర ప్రాకృత సూత్రములు.

5. ఇప్పుడు పరసవర్ణము నుద్ధరించుట అనావశ్యకము, అప్రయోజకము.

6. ఆరంభించితిమా, ప్రాకృతభాషా ప్రబంధ తద్వ్యాకరణములందును ఉద్ధరింపవలయును.

7. మఱి తెనుఁగునను ఛందస్సులో సూత్రములను పెక్కింటిని మార్పవలయును.

8. మఱియు ఈసున్న తగదేని అయాతావులందు హ్రస్వముపై అరసున్న మాత్రము ఎట్లు తగును?

9. మఱియు నీసున్న ఙఞణనమలకు వ్రాఁతలో ఏకచిహ్నముగా నున్నదే గాని దీనిచేత ఉచ్చారణయందు సాంకర్యము రాలేదు. ఉ. వంక, కంచము, పంట, వింత, గంప-ఇత్యాదులను (వరుసగా) ఙఞణనను ఘటితములనుగానే ఉచ్చరించుచున్నాము. ఎవరును వఙ్క, వఞ్క, వణ్క, వమ్క, అనియు-అట్లే కఙ్చము, కఞ్చము, కన్చము, కమ్చ

ము అనియు- షట్ట, షష్ట్ర, షస్ట, షష్ట, అనియుం- నిత్యాదిరీతిగా నుచ్చరించుటలేదు. ఇవి గాకపోయినను దీనికి ఆఱవ యుచ్చారణ యేదియుంరాలేదు.

12. ఈ సుకరవ్యవహారమునుబట్టియే ప్రాకృతాంధ్ర వ్యాకరణములందు ఈ యనుస్వారనియమము చేయఁబడినది.

11. అన్నిటిని తలక్రిందుసేసి ముక్కునకు సూటిగా వ్యవహరింతమన్న— మన మిప్పుడు 'బఙ్గారము' 'సిఙ్గారము' అని వ్రాసినమాత్రాన ధన్యులము గానేరము. ఈపదములు ఈవ్రాఁతప్రకారము ఉచ్చరించిన, బ ఙా గ్ ర ము, సి ఙా గ్ ర ము అగును. తన్నివారణార్థమై బ ఙ్ గా ర ము, సి ఙ్ గా ర ము అని వ్రాయవలయును. అట్లే 'కార్త్స్న్యము' అనుపదము 'కా ర్ త్ స్ న్ య ము అనియుఁ, 'కొండవండ్లు' అను పదమును కొ ణ వ ణ్ డ్ లు అనియు వ్రాయవలయును. అచ్చుకూటములలో పొల్లువర్ణములు ఎన్నియుంజాలవు. వీనికై చేయునట్టి యర్ధమూర్తులు (Half Bodies) కొఱగావు. గదులు మునుపటికన్న పది యింతలు ఇరువదియింతలుగా నుండవలయును. పంక్తులు దీర్ఘతరములగుచు, కాగితములు ఎక్కువవలయును. అచ్చుకూలి హెచ్చును; కాగితములవెల మునుపటికిపుడు మూఁడింతలైనది;ఇందుచే కాగితముల కగువ్యయము మునుపటికి నాలుగింత లగును. వ్రాఁతయందును ఇట్లే పంక్తులును కాగితములును పెరుఁగును. కాలము సిరా ఎక్కువ వలయును.

12. మఱియు మూలమందు సున్నగల ప్రాకృతశబ్దముల తత్సమరూపములకు ఈపద్ధతిచే నయినపరసవర్ణమువలన తత్సమత్వము చెడి తద్భవత్వము కలుగును.

13. సంజ్ఞలు గానివి "శతయోజనములు" లోనగు సంఖ్యావిశేషణక తత్పురుషములు సంస్కృతమున ఘటింపవు. తత్సమమునం గలవు.

## IV. అన్యదేశ్యములు.

(i) ఆంధ్రదేశ్యములవలెనే అన్యదేశ్యములును ప్రయోగ వ్యవహార రూఢములు నిఘంటువున నుండవలసినవే.

1. సీతారామాచార్యులవారు ఈ రెండు తెగలదేశ్యములను దే. అను నొక సంకేతముతోనే ఘటించినారు. నిఘంటువున కంతయుఁ ఐదాఱు శబ్దములను (సిపాయి, హొన్ను, అను నిత్యాదులను) 'ఇది అన్యదేశ్యము' 'ఇది యన్యదేశ్యము' అని వ్రాసినారు. దీనింబట్టి యాలోచింపఁగా దేశ్యములని తాము పేర్కొన్నవి అన్నియు ఆంధ్రదేశ్యము లనియే వారు తలంచినట్లు తోఁచుచున్నది.

2. ఆంధ్రదేశ్యభ్రమచేతనే తాలవ్యచజలు గల యన్యదేశ్యపదములను తద్విపరీతముగా దంత్యచజలతో వ్రాసినారు.— జావాహర్, జామ (పండు). కొందఱు వైయాకరణులు తాలవ్యోచ్చారణ నతిక్రమింపఁ జాలక జే మ పం డని పఠించినారు.

3. అన్యదేశ్యములందు చజలకు నైసర్గికమై వ్యవహారరూఢమైన తాలవ్యత్వ దంత్యత్వములను తెనుఁగులోఁ పాటింపనియెడల శ్రుతికటుత్వము కలుగును. ఉ. జూను జూలై నెలలు, బాజా బజంత్రీలు, కూజా, మోజాణ, పిచోడీ, జావాహరి.

(ii) ములు లేక మనకు వ్యవహారము జరుగదు. ఆకారణముననే వాని గ్రహింపవలసినదిగా అప్పకవి చెప్పినాఁడు.

"క్షితి మ్లేచ్ఛభాష శ్రుతి గ
హీనత మగు; నటులైన నీధరిత్రిని దానిన్
మతి రోసి విడువఁగూడదు
సతతము వ్యవహారహాని సంధిలుకతనన్."

1. తుపాకులు, సనీలు, జబరుజంగులు, జజాయీలు ఔట్లు లేక శత్రువుల నెట్లు పాఱఁదోలుదుము? [Hin. Tufang, Sanin, Zafar Jang (The ruler of the battle), Zazail; Eng. Howitzer (Howitze.)

2. మనము తియ్యఁగా తినెడు 'కొబ్బెర' మలయద్వీపమునుండి వచ్చిన 'కోప్రా' (Copra).

3. మనము గినీ యరఁటిపండ్లను మానుకోవలసినదా? ఆఫ్రికాలోని యా గినీదేశమునకు స్వదేశజులు వ్యవహరించు నామ మయిన 'ప్యాఫూఆ' పదములో మితవ్యయనీతిప్రాజ్ఞులు ఆఱవలు 'ప్యా ఆ' వదలి 'ఫూ' మాత్రము గ్రహించి 'ఫూవాణ్ణు' అని దానినే కాఁజేయుచున్నారు.

4. బటావియా (Batavia) దేశజమై జ్వరమందు సైతము భుజింపఁగిదన దగు బత్తా (నారింజపండు),—

5. పాపా (Sp. Pawpaw) యను నామముఁగల పశ్చిమేండియా (West Indies) ద్వీపజవృక్షవిశేషమం దుత్పన్నమై పాపాయ (Papaya) అనునామమున నాద్వీపమందే పరఁగి, మామిడిపండు వలె పులుపుదోషము లేక, ఇంచుక గబ్బయినను కేవల మధుర రసోత్తరంగమైన బొప్పాయపండు,—

6. అమెరికాయం దుత్పన్నమై అచటిభాషలో అనానాస్ అని వ్యవహృతమై స్పెనియార్డులవలన మనకు లభించిన- అనాసపండు,-

7. అమెరికాఖండములో మెక్సికోదేశములో నుత్పన్నమై అందు కోచిట్ సాపోట్ల్ (Cochit-Zapotl) అను సంపూర్ణ నామమున వ్యవహృతమై స్పెయిన్ దేశజులవలన మనకు లభించిన యమృతగుళిక యగు సపోటాపండు (Sp. Zapote),-ఇవి యన్నియు వదలుకొన్న యాజన్మమేల?

8. నాజర్లంగుతోఁటకూరను ధనాసరిగోఁగుకూరను ఆంధ్రులు తినరాదా?

9. గోవా, మల్గోవా, రుమానియా, పీతరు, ఖాదర్పసందు, నీలంపసందు, దిల్పసందు, ఈపసందులన్నియు పరులపాలే కావలసినవా?

10. మనగతి దాడీపసందు అదే తాటిపసందు అదే తాటిపండు మాత్రమా? బంగాళా యరఁటిపండ్లుకూడ వైదేశికములే గదా.

11. మఱియుఁ పరంగిదొరగారికి కుసినీవాఁడు లేక, ఇంగ్లీషుదొరగారికి బొట్లేరులేక, ఒకదిన మైనను జరగదు. వానిచేతిలో పావులా పెట్టక దొరగారి దర్శనము కాదు.

12. సోడాబుడ్లు లేక మనకు ఒకపూట యైన వెళ్లదు.

13. ఈవ్యాసమును విస్తరించి వ్రాయుటకు దస్తా కాగితములు చాలవు.

14 దీనిని ముద్రించి పంచిపెట్టుటకు పదిరీములు వలయును.

15. సాయంకాలపు సికారికి పైగోతంగణాలఫీటను మనోహరము.
[Hin. Shikar, (Eng.) Pegu, Tonquin; Eng. Phaeton.]

16 [సంస్కృతమందును గుఱ్ఱములంజెప్పుశబ్దములు ప్రాయికముగా తజ్జాతిజన్మదేశనామములుగాఁగాని, తత్ప్రకృతికములుగాఁగాని యున్నవి.-

"వాజివాహార్వగన్ధర్వహయసైన్ధవసప్తయః
ఆజానేయాః కులీనాశ్వాః వినీతాః సాధువాహినః.
వనాయుజాః పారసీకాః,
కామ్బోజా బాహ్లికా, హయాః."

పై సైంధవ, గంధ, ర్వాజానేయ, వనాయుజాదులు దేశ సూచకములు. సింధుదేశము ఇండియాలో వాయవ్యమున నున్నది. గంధర్వదేశము ఇండియాకు పూర్వోత్తరమున నున్నది. ఆజానదేశము ఆఫ్రికా ఖండములో తూర్పున సముద్రతీరమున నున్నది; అటనుండి మేలైన గుఱ్ఱములు పరదేశములకు విక్రయార్థము పంపఁబడు నని భూగోళాది గ్రంథములవలనం దెలియును. పైఁ జెప్పిన వనాయ్వాది దేశములు ప్రసిద్ధములే. ఇంకను 'శక ధారాఽఽరట్ట ఘోట్టాణముల్' కలవు.]

17. బిరుదాంకములు మూరురాయరగండాదులు అన్యభాషాపద ఘటితములు. శ్రీకృష్ణరాయని బిరుదములను వదలఁదరమా?

18. మనకు రోగములు వచ్చినప్పుడు సాలామిస్రి, సఫేదమిస్రి, రూమ్ మస్తకి, గావుజుబాన్, అంబరు- ఇవి కర మారోగ్యకరములు.

(iii) అన్యదేశ్యములు నానాభాషలనుండి వచ్చి యున్నవి.—
అఱ. - తైరు; కన్నడ.- హొన్ను; హిం. - జిలేబి. మిఠాయి; మహా.- ఉఠాణి (ఆమతింపు); ఇంగ్లీషు.— పటాలము (Battalion), పప్పళి (Poplin); ఫ్రెంచి.—కుమందాను (Commandant);మలయ.- గిడ్డంగి (Gangdong); ఓఢ్ర.-పండా, బారికవాఁడు; పోర్చుగీసు.- బాతు (Bato); స్పెనిష్.-గోయ్యా (పండు) (Guyaba-మెక్సికో శబ్దము), పారసీ. - తాప్తా, తాపితా; ఇత్యాదులు.

(iv) సంస్కృతమందును అన్యభాషాపదములు కలవు.
వరాహమిహిరాది కృత జ్యోతిషగ్రంథములందు గ్రీకుపదము లనేకములు చొచ్చి యున్నవి.

1. క్రియ తా వు రి జి తు మ కులీ
ర లేయ పా థో న జూ క కౌర్ప్యాఖ్యాః
తౌ క్షి క ఆ కో కేరో
హృద్రోగ శ్చాన్త్యభం చేత్థమ్." బృ. జా.

ఇందలి యీరాశినామములలో కులీర హృద్రోగాన్త్యభములు దక్క కడమ గ్రీకునామములు. అట్లే—

2. "కేన్ద్రాత్పరం ఫణఫరం పరత స్తు సర్వ
మాపోక్లిమం హిబుక మమ్బు సుఖం చ వేశ్మ
జామిత్ర మస్తభవనం సుతభం త్రికోణం
మేషూరణం దశమ మత్ర చ కర్మ విద్యాత్"—బృ. జా.

ఇందలి యసంస్కృతీయములు గ్రీకుపదములు.—

3. కేంద్ర మనునది గ్రీకునుండి ఇంగ్లీషయిన 'సెంటరు' (centre). C అనువర్ణమునకు గ్రీకున కకారోచ్చారణ ఇంగ్రీషులో సకారోచ్చారణ. నాభసయోగ మయిన 'కేమద్రుమ' ము గ్రీకు శబ్దము.

(V) మన దేశభాషాపదములు కూడ చమత్కారాదికారణములచే సంస్కృతమందు చొచ్చినవి.

1. "కర్పూరధూళీ రచితాలవాలః
కస్తూరికా కుఙ్కుమ లిప్తదేహః
పన్నీర పూరైః పరిషిచ్యమానః
ప్రాఞ్చం గుణం ముఞ్చతి కిం పలాణ్డుః."

'పన్నీర' శబ్దమునకు పండిత శిఖామణులు 'పత్ = పాదము = చంద్రపాదము' అని నుడివి, 'పన్నీర' మన హిమాంబువునకు పర్యాయము సంస్కృతమే అని, ఆధునిక నవలనుంబోలె సాధించినారు. వాస్తవము పని (మంచు) నీరు, అని అఱవము.

2. "అఫీమం కుచిలా గఞ్జా విషం టఙ్కణకం తథా
ఏత త్పఞ్చామృతం భుక్తం నపునా రోగవాన్ భవేత్." నాట.

ఇట అఫీమ (అభిని) గంజా (గంజాయి) శబ్దములు హింధీభాషలోనివి. వీనిని సేవించిన మఱిరోగముండ దనుటకు సందియము లేదఁట! ప్రాణ మున్నంగదా రోగము !

"యదస్మాభి స్సంభూయ హున్నానాం షష్టి ర్దాస్యతే భవద్భ్యః"
[నాటవాట.

ఈ హున్నము కర్ణాటకుల హొన్ను - వరహా అర్థము.

"న యాచే హిందూకం పర్వణి దత్తైక డబ్బాకం
యాచే మొగల్లులాకం తృణీకృతస్వర్ణ చన్దూకమ్."

ఈ మాటవినఁగానే ఆమొగలాయీ తహాస్సీలుదారుఁడు ఈకవికి తన బంగారు చందుగా ఇచ్చివైచినాఁడు.

5. ఒకానొక కృపణోక్తి.—

"ఏకైక దబ్బుః కులపణ్డితానాం
దబ్బు ద్వయం కుణ్డలపణ్డితానామ్
యాగాని యాగాని యతీశ్వరాణాం
కాసు ద్వయం చిల్లర బ్రాహ్మణానామ్."

అయినను ఈ చమత్కార శబ్దములు సంస్కృత నిఘంట్వాద్యారూఢ ములు కాలేదు.

అట్లే ఈనిఘంటువునం దగపడుశబ్దములన్నియు నుత్తమకవిత్వమునకు ఎక్కవలయు నని మదీయాభిప్రాయము గాదు.

(vi) ఇంగ్లిషులో నయితము అన్యదేశ్యములు పెక్కులు గలవు.—

Betel leaves, Sanskrit, Mongoose, Charpoy, Pandit, Munshi, Sahib, Rupee, Anna, Pie, Kavalgar, Poligar, Zamindar, &c.

## V. శబ్దవ్యుత్పత్తి

[శబ్ద తద్వ్యుత్పత్తులు సంగడిగా ప్రత్యక్ష మగుచుండునేని త ద్విష్టల వ్రాఁతలలో తత్స్వరూపార్థములందు వ్యత్యయములు తగ్గును.]

1. సంస్కృతశబ్దములకు వ్యుత్పత్తి ఆకరములయందు లభ్యము. అయినను,
2. అందు కొన్నిటికి సాధువ్యుత్పత్తిని కనిపట్టవలసి యున్నది.
3. సంస్కృతభవముల నెఱుంగుటకై సంస్కృతజ్ఞాన మావశ్యకము.
4. మనుష్యనామము లనేకములు ప్రకృతి శబ్దస్వరూప హ్రాస శబ్దాక్షర ధ్వంస వ్యత్యయములకు మంచియుదాహరణములు.—

జగ్గయ్య ... జగన్నాథయ్య
ఆదయ్య ... ఆదినారాయణయ్య
సుబ్బయ్య ... సుబ్రహ్మణ్యయ్య

| | |
|---|---|
| సీతయ్య | సీతారామయ్య |
| సీనయ్య | శ్రీనివాసయ్య |
| సోనమ్మ | స్వర్ణాంబ |
| నారయ్య | నారాయణయ్య |
| జన్నడు | జనార్దనుఁడు |
| | అఖిలాండకోటి బ్రహ్మాండనాయకయ్య |
| కన్నయ్య | కృష్ణయ్య |
| పున్నమ్మ . | అన్నపూర్ణమ్మ |
| మాణిక్యము .. | మాణిక్యవాశకర్ |
| వేలు ... | వేలాయుధస్వామి |

5. ప్రాకృతసమ ప్రాకృతభవ భేదముల నెఱుంగుటకు ప్రాకృతతద్భేద జ్ఞానము మహోపకారకము.

6. ప్రాకృతశబ్దముం జూపుటచే శబ్దము ప్రాకృతసమమో ప్రాకృతభవమో విశద మగును.—

| | | | | | |
|---|---|---|---|---|---|
| దృష్టమ్ | దిట్ఠం | దిట్టము | లాఙ్గలః | ణాంగలో | నాఁగలి |
| యుక్తిః | | జితు | వారాణసీ | వాణారసీ | బనారసు |
| దణ్డః | దండు | దండు | కరవీరః | కణవీరో | గన్నేరు |
| నిశా | ణిశి | నిసి | షడ్జః | సజ్జో | స(రిగమ) |
| | సాహులియా | సాలు | ఋషభః | రిసబో | (స)రి(గమ) |
| శబ్దః | సద్దో | సద్దు | ఆర్ద్రమ్ | అల్లం | అల్లము |
| రాత్రిః | రాఈ | రేయి, రే | భ్రూః | భుమఆ,భమఆ | బొమ |
| రాజా | రాఊ | రావు | వాచ్ | వాఆ | వాయి, వా |
| శైలః | సేల | సెల | తుణ్డమ్ | తోండం | తోండము |
| రాజపుత్రః | రాఉత్తో | రాహుత్తుఁడు | ముణ్డమ్ | మొండం | మొండెము |

7. ప్రాకృత దేశీజ్ఞానముచే మనదేశ్యముల పూర్వరూపాదికము తెలియును.

| | | |
|---|---|---|
| (కథయతి) | చవఇ | చెప్పును |
| (శక్నోతి) | చయఇ | చేయును |

| | | |
|---|---|---|
| (తక్ష్ణోతి) | చచ్ఛఇ | చెక్కును |
| (హుతాశనః) | చిచ్చీ | చిచ్చు |
| (శేఖరః) | చుంచుఓ | చుంచు |
| శ్వశ్రువు, మేనత్త, తల్లి, చెలికత్తె } | అత్తా | అత్త |
| (బలాత్కారః) | అక్కసాలా | కసాలా |
| (అళిన్దః) | ఓసారిఆ | వసారా |
| (దరిద్రః) | ఇల్లో } ఎల్లో } | ఇలో (నారాయణమ్మ) |
| (నగరాధ్యక్షః) | తలారో | తలారి |
| (వ్యాఘ్రః-సింహశ్చ) | ఫుల్లి | పులి |
| (చుమ్బితమ్) | ముద్దీ | ముద్దు |
| (బాలః) | లింకో | లెంక |
| (ధాన్యవిశేషః) | వరఇఓ | వరి |

8. అన్యద్రావిడభాషల జ్ఞాన మావశ్యకము. ఉ. వచ్చును — రాఁ అఱవధాతువు 'వరు' - ఇందు వకారరేఫములు రెండును గలవు. అఱవము.—వరాన్, వరుగురాన్ — వారాన్.

9. ఱాకు ద్రావిడశబ్దముతో సామ్యముం గనందగును.
ఏఱు - ఏటికి — ఆఱ్ — ఆట్రుక్కు. నూఱు - నూటికి — నూఱ్ - నూట్రుక్కు.

10. కొన్నిశబ్దములకు ద్వైరూప్య మంగీకృతము.

(i) "దాక దగ్గఱ దిగ్గియ దాయఁ బోయి
దాపలను దిగ్గు మనుచోటఁ దథ్యముగను
డాక డగ్గఱ డిగ్గియ డాయఁ బోయి
డాపలను డిగ్గు మని డా కడంగి నిలుచు." అప్పక

(ii) నడచు — నడుచు. బ్రదుకు - బ్రతుకు.
అదుకు — అతుకు. పిదుకు — పితుకు.

(iii) "పూనె నెగనెఁ బోనరె బోందె నటన్న
పలుకులందు మొదలఁ గలుగునట్టి
వ్యంజనంబు లుండు వలయుచోఁ నేఁ గడు
నూనె నెగసె నోనెరె నోదపె నోందె." అప్పకవి.

11. ఇట్టిస్థలములందు కాలిక పౌర్వాపర్యమును నిర్ధారింపవలయును.

12. కొన్నిట పౌర్వాపర్యము స్పష్టము:— వైచు — వేయు; తిగుచు— తీయు; వెడలు — వెళ్లు; సడలు — సళ్లు.

13. విడుచు, పిలుచు, నిలుచు - ఇత్యాదులకు పండితమ్మన్య వ్యవహ్రియమాణములైనవి - విడచు, పిలచు, నిలచు - ఇత్యాదులు తప్పు లని తెలుపవలయును.

14. సంస్కృత హలంతములు తెనుఁగులో అజంతము లగును ఉ. వాక్ — వాకు, వాక్కు.

15. తెనుఁగు ప్రాకృతమర్యాదలను మిక్కిలి పాటించునది గావున, అఱవ హలంతములును ఇందు అజంతము లగును. ఉ. పాల్ — పాలు; అవన్ — వాఁడు; కణ్ — కన్ను; పల్ — పల్లు.

16. ఆంగ్లాది హలంత తత్కల్పములకును ఇందు ఇదే మర్యాద. ఉ. కనిష్టేబిలు, రైలు, రోడ్డు, కోర్టు, జడ్జీ. ఈక్రిందివ్యాహారమును గూడ నేను రాజరాజనరేంద్రుని రాజధానిలో విని యున్నాఁడను:—ఒక బి. ఏ. బి. ఎల్. గారు కాలేజి ప్రొఫెస్సరైన యొక బి. ఏ గారితో గద్దించుట:—

"వా డ్డూ యూ మీనూం? యూ మ్యానూ!
వైసై కేనూ, యూ వ ర్నాటట్ హోనూ."

ఇందు వక్త ఉత్తరార్థమందు 'కేమూ' 'హోమూ' అనియే పలికి యుండునుగాని, నాకు 'మీనూ' 'మ్యానూ' సాహచర్యముచే 'కేనూ' 'హోనూ'గా వినంబడినవి.

17. ఈప్రాకృతమర్యాదా పక్షపాతము మనభాష 'తూర్పు ఇటాలియన్' (Italian of the East) అగుటకు నొక కారణము.

18. అర్ధానుస్వారము వర్ణాన్తరస్థానీయము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| లాంగలము | — | నాఁగలి; | కలను | — | కలఁకులు; |
| కొలను | — | కొలఁకులు; | హిన్తాళః | — | ఈఁదూడు; |
| కణ్డః | — | కాఁడ; | భుజఙ్గః | — | బొజుఁగు. |

19. హిందీ ప్రాకృత సంస్కృతాది శబ్దములు ఏకాంధ్ర పదమునకు ప్రకృతిగా నగపడుచోట రూపమందును అర్థమందును సదృశతమమునే సన్నిహితప్రకృతిగాఁ గొనుట యుచితము.

| తె. | హిం. | సం. | |
|---|---|---|---|
| అభిని | అఫీమ్ | అహిఫేనః | [ఇది కల్పితము |
| గంజాయి | గంజా | గాన్ధారీ | [గానోపు. |
| కదము | కదమ్ | స్కన్దనమ్ | |
| ఉలుప | ఉల్ఫా | ఉపదా. | |

ఈ యహిఫేనాదులు సీతారామాచార్యోక్త ప్రకృతులు.

కిటికీ ప్రా. ఖిడిక్కిఆ హిం. ఖిర్కీ

20. కొన్నిశబ్దములు వింతప్రక్రియ గలవి.

'దగ్గఱు' అని ధాతువు - సమీపించుట యర్థము. దగ్గఱం (బోయి)- తుమున్నర్థకము - అది సప్తమ్యర్థద్వితీయ యను భ్రమచే 'దగ్గఱ' అను ప్రథమ కల్పితము - తర్వాత 'దగ్గఱకు' అని షష్ఠి - 'దగ్గిఱికి' అని ఔపవిభక్తికము కూడ. ఇట్లే 'డగ్గఱు' సయితము.

కుఱ్ఱపాడెగట్టు - 'ఓరి నీపాడె గట్టా (గట్టను), అని తిట్టు - 'నీ' పోఁగా 'ఓరి పాడెగట్టా' ఐనది - అది సంబుద్ధి యను భ్రమచేత 'పాడెగట్టు' అను ప్రథమ కల్పితము, శాపార్థము విస్మృతము, అనురాగార్థము భావితము.

నేరమి — ద్రుతోచ్చారణలో 'నేరం చేశాడు;' ప్రాయికముగా ము వర్ణకమునకు సున్న వచ్చును గనుక 'నేరము చేశాడు' అయినది.

21. శబ్దముల రూపార్థములకు శబ్దశాస్త్రము, ఆంధ్రమున భారతాదులును, తాదృశ ప్రామాణిక ప్రయోగానుసారి నిఘంటువులును, ప్రమాణములు.

22. ఇటీవల మహాప్రాజ్ఞులు పాశ్చాత్యవిద్వాంసులు కల్పించిన ఫైలాలజీ (Philology) పేరి సర్వభాషా శబ్ద వ్యుత్పత్తి సంబంధాది విమర్శన శాస్త్రముచేత, దివ్యదృష్టిచేతనుంబోలె, అద్భుతవిషయము లనేకములు గోచర మైనవి,—

(i) పంచద్రావిడభాషలు (తెనుఁగు, అఱవము, కన్నడము, తులువము, మలయాళము) పరస్పరసంబంధము కలవి యని మనకు తెలిసియే యుండినది. ఇప్పుడు ఈశాస్త్రమువలన ఆతెలివియే శబ్దముల సూక్ష్మ సూక్ష్మతర సంబంధ జ్ఞానపూర్వకముగా రూఢిపడినది,

(ii) మఱియు, ఈద్రావిడములదేశ్యమును పలచాటుభేదములతో భాషించువారు దేశజను లేమి ఆరణ్యకజాతు లేమి ఇండియాదేశ మంతటను వెలుపలనుం గూడ— అనఁగా — వింధ్యమువఱకు బస్తరు లోనగు గాండ్వానా మన్నెములు, విశాఖపట్టణము జిల్లాలోను గంజాము జిల్లాలోను గల మన్నెములు, వింధ్యమును దాఁటిన ఆసాము బంగాళాలలోని కొన్నిప్రదేశములు, పడమట బెలూచిస్తానుదేశము, ఇత్యాది దూరస్థలములందు-పరస్సహస్రవర్షములనుండి యుండుటయు,

(iii) ఈద్రావిడ భాషల సంబంధి భాషలు తార్తారము, ఏషియాతుర్కీ, నీలసముద్రోత్తర తీరపు నాడులు, ఆఫ్రికాలో ఈజిప్టు, ఇత్యాది స్థలములయందు ఆదికాలమునుండియుం గలుగుటయు,

(iv) ఈభాషలకు పసిఫిక్కు మహాసముద్రములో సుమాత్రా, జావా, ఆస్ట్రేలియా ద్వీపములు, ఇత్యాది ప్రదేశములందలి భాషలతోఁగూడ అసందిగ్ధ సంబంధము కలిమియు,

(v) మఱియు వీనియందలి వైకృతభాగమునకు సంస్కృత ప్రాకృతములు ద్వారముగా ఐరోపాఖండములోని నానాదేశముల పురాతనేదానీంతన భాషలతో మంచిసంబంధము కలిమియు,

(vi) ఆసంబంధముల వివరములును, ఈశాస్త్రమువలన నెఱుకపడిన యద్భుత విషయములలో ఒకకొన్ని. కావున, ఈనూతనశాస్త్రమందు నిష్ణాతత్వము వ్యుత్పత్తిసిద్ధికి మహోపకారకము. ఈశాస్త్రము శబ్దవ్యుత్పత్తులకు నికషోపలస్థానీయము.

---

## VI. అప్రమాణములు.

1. వ్యుత్పత్తి ప్రతిష్ఠాపనము ముఖ్యప్రయోజనములలో నొకటిగా నిర్వహించున దగునిఘంటువులో వ్యుత్పత్తివిరుద్ధముగాను, అర్థవ్యత్యయము కలుగునట్లుగాను, వర్ణత్యాగాదికరణము అనుచితము.

జాగ్రత్త (జాగ్రత్ + తా=మెలఁకువ) — జాగ్రత (జాగర్త);

సత్త్వము (సత్+త్వ=బలము) - సత్వము (సకారము).

తత్త్వము (తత్+త్వ=బ్రహ్మము) — తత్వము (తకారము.)

సన్న్యసము (సమ్+న్యాసః = సర్వసంగపరిత్యాగము) — సన్యాసము (ఇల్లడతో కూడుకొన్నట్టిది.)

పృథా—పృధా; యథార్థము— యధార్థము.

[అర్థము (ధనము, ఇద్యాది)—అర్ధము (సగము, ఇత్యాది).]

ఈభేదమును పాటింపక కొందఱు కవులును తెనుఁగు నైఘంటుకులును ఈపదములలో ద్విత్వములను మానినారు, ధకారమునే పఠించినారు. శబ్దరత్నాకరమందు సయితము ఈపొరఁబాట్లుఁ గలవు.

2. నిఘంటుకారులకు పొరఁబాట్లచే చెఱుపు గలదు. శబ్దరత్నాకరమునుండి యొకకొన్ని యుదాహరణము లొసంగెద.—

(i) ఇందు శకటరేఫార్థమై 'గోఱజంబు' నకు 'చాఱపప్పు'నకును పర స్వర ప్రాసముగా రెంటిక్రిందను ఒకటే ప్రయోగ మొసంగినారు. "గోఱజంబు జున్ను చాఱపప్పు" మను.

(ii) మాఱు శబ్దమున లఘురేఫంబు గల దని దీని నుదాహరించినారు.—
"అమరసేనలును దమంతన వర్తింప। నేర కునికి నాకు మారు మొగము గానొనర్పవలసెఁగాదె; సమస్తసే। నలను నీవ యరసి నడపవలయు."
[భార- ఉ. ౪. ఆ. ౧౪౪.

ఇచట దుర్యోధనుఁడు వక్త, భీష్ముఁడు శ్రోత, ఆ కు మా రు ణ్ అని ఛేదము, ఆకుమారస్వామిని అని యర్థము.

(iii) వేర్వేఱ - ఇందు రెండవదియు లఘురేఫ మని వ్రాసి,
"కౌరవులసేమ మెల్ల వేర్వేర నడిగె" భార. ఉ. ౨. ఆ. ౧౧౬ ప.
అని సంజయవాక్యము నుదాహరించినారు. ఇందు సరియైన పాఠము—
"కౌరవులసేమ మెల్లఁ బేర్వేర నడిగె," అనఁగా ఒక్కొకరినిం బేర్కొని యడిగె ననుట; పేరుశబ్దము గాని వేఱుశబ్దము గాదు. అడిగినవాఁడు ధర్మరాజు, ఆయడిగినఘట్టములో భీష్మ ధృతరాష్ట్ర ప్రభృతి కౌరవుల నొకరొకరిం బేర్కొని యడిగినాఁడు. భార. ఉ. ౧. ఆ. ౨౭౬ - ౨౮౧ చూడుఁడు.

(iv) సీతారామాచార్యులవారు పార్షత శబ్దమును తప్రాసములో
"ఆతనికి నాకునుం గలిగె నాహవ... ఖా। ర్షదుఁడును..."
అని తాకు బదులా దాతో ప్రాక్తన భారతముద్రణమం దున్నది యున్నట్టుగా శబ్దరత్నాకరములో నుదాహరించినారు. దానింబట్టి కొంద ఱిదానింజనలు పద్రపాస మారంభించి, అందులకు ఈప్రయోగముం జూపినారు. ఇట పార్షతుఁ డనఁగా ధృష్టద్యుమ్నుఁడు.

అతఁడు పృషతుఁడనురాజర్షికి గోత్రాపత్యము, పార్షతుఁడే గాని పార్షదుఁడు గాఁడు. అట్లే ద్రౌపది పార్షతి. ఇట్లని సంస్కృత భారత వాచస్పతినిఘంట్వాది ప్రమాణములచే నెఱుంగవచ్చును.

3. వ్యుత్పత్తివిషయమందును శబ్దరత్నాకర వైకృతదీపికలను సంపూర్ణముగా విశ్వసింపఁ దరముగాదు. ఎట్లన—

(i) ఊదువత్తి-అన్యదేశ్యము [హిం. ఊదు=సాంబ్రాణి - బత్తి=వత్తి - సం. వర్తి- తె. వత్తి.] శబ్దరత్నాకరకారులు ఇందు ఊదు అనుభాగమును ఊఁదుధాతువుగా నెంచి అందు అరసున్న గూడ నుంచినారు. అందు అరసున్నకుం బ్రసక్తి లేదు.

(ii) కరణిఁ (=వలె); ఇది దేశ్యమని సీతారామాచార్యులవారు వ్రాసినారు. ఇది ప్రాకృతసమము. ఎట్లన—గాథాసప్తశతి 3(100)—

"అహా సరస దంత మండల। కవోల పడిమా గఓ మఅచ్ఛీఏ
అంతో సిందూరిఅ సం। ఖ వత్త కరణిం వహఇ చందో."

ఛా."అసౌ సరస దన్త మణ్డల కపోల ప్రతిమాగతో మృగాక్ష్యాః
అన్తః సిన్దూరిత శఙ్ఖ పాత్ర సాదృశ్యం వహతి చన్ద్రః."

ఇందువలన కరణి యనునది సాదృశ్యవాచకమైన ప్రాకృత శబ్దమని విశదము.

(iii) అగడిత. దే. వి. [అఱవము. అగఴి - అగఴు ధాతువు (త్రవ్వు.)] వైకృతదీపికయందు దీనికి అఖాతము ప్రకృతిగా చెప్పఁబడినది. ఆపక్షమున డకారమునకు గతికనఁబడదు. ఈపక్షమున తకారమును 'వ్రాఁత' శబ్దమునందుంబోలె కృత్తునుగా నరయవలయును. అఱవమందలి ఴ కారమునకు తెనుఁగున డకారము ప్రాయికముగా నగును. ఉ. పాఴు-పాడు, ఏఴు — ఏడు. ఈ యఱవయక్షరము ళకారముపోలికగా నుచ్చరింపఁబడును.

(iv) శబ్దరత్నాకరమందు రాహుత్త కైవార శబ్దములు సంస్కృత శబ్దములుగా వ్రాయఁబడియున్నవి. ఇవి సంస్కృత నిఘంటువులం దెచటను దొరకలేదు. ప్రసిద్ధమైన కావ్యనాటకాదులందును గనఁబడవు. వీనిని ఆంధ్రకవులు దిట్టతనముచేత సంస్కృతశబ్దములతోఁ జేర్చి సిద్ధసమాసములందు ప్రయోగింపఁగా గని సీతారామాచార్యులవారు సంస్కృతముగాఁ దలంచి రని యెన్నందగియున్నది.

"ఓరాహుత్తశిరోమణీ" మనుచ.

"ఈకైవారదుర్భాషణంబులకుఁగాసియతండు మెచ్చఁడు" శృం. నై.

రాహుత్తః. ప్రా. రాఉత్తో సం. రాజపుత్రః.

కైవారము. ప్రా. కఇవాఆరో సం. కవివ్యాహారః.

(V) దేవళ శబ్దమునకు శబ్దరత్నాకరకారులు వైకృతదీపికలో దేవాలయ శబ్దమును ప్రకృతిగా చూపినారు. కాని, దేవకుల శబ్దము ప్రాకృతములో 'దేఉళం' అని ప్రసిద్ధమై హేమచంద్రాదులచే ప్రాకృత వ్యాకరణ శాస్త్రమందు ఉదాహృతమై యున్నది. కావున అదియే ప్రకృతి యనుట సమంజసము.

4. సంస్కృతనిఘంటు తట్టీకలను గూడ అవిమర్శముగా విశ్వసింపఁదగదు.

(i) ఎట్లన— అంకశబ్దార్థములందు నానార్థరత్నమాలలో—

"అఙ్కో నాటకవిచ్ఛేదే సంఖ్యాయాం యుధి భూషణే
సమీపే రూపకే స్థానే మతౌ వుత్సఙ్గచిహ్నయోః."

అనియు, తట్టీకయందు 'మతౌ=బుద్ధియందును' అనియుఁ, విశ్వనిఘంటువులో—

"అఙ్కః స్థానేఽన్తికే మన్తౌ రూపకోత్సఙ్గలక్ష్మసు
నాటకాదిపరిచ్ఛేదే చిత్రయుద్ధే చ భూషణే."

అనియు, మేదినీకోశమందు—

"అఙ్కో భూషా రూప కలక్ష్మసు
చిత్రాజౌ నాటకాద్యంశే స్థానే క్రోడేఽన్తికాగసోః."

అనియుం, గలదు. ఈ కడపటి రెంటను తొలిదాని 'మతి' స్థానమున, 'మంతు'వును, (=) 'ఆగస్సు'నుం, జెప్పఁబడినవి. మఱియుపై మత్యర్థము ఆప్టి మోనియర్ విల్లియమ్సు వాచస్పత్యాదుల నిఘంటువులందు లేదు. వానియందు అపరాధార్థము కలదు. "ఆగోఽపరాధో మన్తుశ్చ" అమరము. కావున నానార్థరత్నమాలయందలి 'మతి' ముద్రణమును తట్టీకయుం బ్రామాదికములు గానోపు.

ఇంకొక యుదాహరణము.—

(ii) అంకపాళి శబ్దమునకు 1. కౌఁగిలి, 2. దాది, 3. వేదిక యను గంధద్రవ్యమును, అర్థములుగా ఆప్టివాచస్పతి మోనియర్ విల్లియమ్సుల నిఘంటువులందు చెప్పఁబడియున్నది.

" అఙ్కపాళి ర్దారికాయాం కోటా వాలిఙ్గనేఽపిసా." నానార్థరత్న.
దీనిటీకలో దారిక యనఁగా స్త్రీశిశు వని యున్నది.

స్మృతా కోట్యాం ధాత్రికా పరిరమ్భయోః." విశ్వ.
దీనిటీకలో 'కోటి' యనఁగా వేదికయను శాకవిశేష మని యున్నది. శబ్దార్థ కల్పతరువునందు నానార్థరత్నమాలా వాక్యమునకే 'దారిక' యన మద్దిచెట్టనియు, 'కోటి' యన అంచు అనియు, వివరణమున్నది. ఇందు 'దారికాయామ్' అను నది 'ధాత్రికాయామ్' అనుటకు లేఖకాది ప్రమాదజనిత మనియు, 'కోటి' యనఁగా వేదిక యను నోషధి యనియు, గ్రహించినచో సమాధాన మగును. సీతారామాచార్యులవారు 'వేదిక' యనుదానికి బదులుగా 'తిన్నె' యని వ్రాసినారు. ఇట్టివి త్రవ్వినకొలందియు పెక్కులు బయలువడును.

## VII. అర్థ ప్రకరణము.

1. శబ్దములకు నానార్థములలో కాలక్రమము నేర్పఱుచుట కొన్నిట కష్టము. ఉ. అడుగు = పాదము, క్రిందిభాగము.

2. కొన్నిట కాలక్రమము స్పష్టము. ఉ. కాలు-పాదము = చరణము-నాలవభాగము.

3. వైకృతములందు మూలార్థాతిక్రమము కలదు.

(i) విశేషవాచకము సామాన్యవాచక మగుట. ఉ. రాంబోందు, గందరగోళము ; [రామబన్ధుః = జటాయువు ; గన్ధర్వకోలాహలః = గంధర్వులయేని సంగీతగాంద్రయేని యల్లరి.]

(ii) సామాన్యవాచకము విశేషవాచక మగుట అయ్య = తండ్రి (ఆర్యః = పెద్దమనుష్యుఁడు) ; తొండము = ఏనుఁగుచేయి (తుణ్డమ్ = ముఖము.]

4. సంస్కృతసమములందును మూలాతిక్రమము కలదు.—
అనుమానించు=వెనుదివియు, సందేహించు (మూలార్థము; లింగముం బట్టి లింగిని ఊహించుట; ఉ. పొగనుబట్టి నిప్పును ఊహించుట.)

5. కొన్ని తద్భవములకు మూలార్థములలో కొన్నియే నిలుచును.
ఉ. సిరి=లక్ష్మి, సంపద; మూలము శ్రీః—
"శ్రీ ర్వేష రచనా శోభా భారతీ సరళద్రుమే
లక్ష్మ్యాం త్రివర్గసంపత్తౌ వేషోపకరణే మతా." విశ్వమేదిన్యౌ.

6. అనుద్వేజకతార్థమై మృతాశౌచమును సూతక మనుట; (సూతక మనఁగా వ్యుత్పత్తింబట్టి పురుడు.)

7. సంక్షేప వ్యవహారార్థమై 'సద్దు;' (సద్దు అనఁగా శబ్దము. ఇచట సద్దు చేయు మని భావము గాదు, చేయ వల దని భావము)

8. రూఢ్యర్థము మాఱక వాచ్యార్థము మాఱునట్లుగా నామము భాషాంతరములందు అనూక్త మగుటకు -

"మంగలవాని వంతెన" యొక మంచి యుదాహరణము. ఇది మదరాసులో మైలాపూరునకు ఉత్తరమందుఁగల యొకవంతెన. ఇది హామిల్టను అనెడి యెంజినీరు కట్టించినందున ఇంగ్లిషులో 'Hamilton's Bridge' (హామిల్టన్సు బ్రిడ్జి) అను పేరం బరఁగి, అఱవములో ఉచ్చారణ భేదముచేతను భాషాంతరీకరణముచేతను "అంపటన్ వారావది"యై, దానియాంగ్లీకరణముగా మరల 'Barber's Bridge' అయి, అందుల తెలుఁగుగా 'మంగలవాని వంతెన' అయినది.

ఇంచుక యిట్లే (హిం.) "అఫీమ్" సంస్కృతములో "అహిఫేనః" అయినదని తోఁచుచున్నది.

## VIII. వర్ణగ్రహణము.

1. అన్యదేశ్యములకై తెనుఁగు వర్ణసమామ్నాయములో నూతనాక్షరగ్రహణమనావశ్యకము. గీర్వాణమందేమి, మనభాషయందయేమి, ఉన్న యక్షరములలోనే వానిని వ్యవహరించుట ప్రసిద్ధమై యున్నది.
2. నిఘంటువులలో ఉచ్చారణనిశ్చయార్థము అన్యదేశ్య శబ్దానువాదములందు భాషాంతరాపూర్వ వర్ణగ్రహణము వలసియుండును.

## IX. ప్రయోగోద్ధరణము.

1. అర్థాది నిర్ణయమునకై అసందిగ్ధ పాఠకములైన భారతాది ప్రయోగములు ప్రదరి[illegible]ములు.

2. వ్రాతలోను అచ్చులోను ఉన్నమాత్రాన కంఠోక్తలక్షణవిరుద్ధమును ప్రమాణీకరించుట సాధుమతము గాదు.

"శాస్త్ర ప్రయోగవచసోః శాస్త్రం బలవ దుచ్యతే;
అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం హితమ్"

## X. అకారాది క్రమము.

చజరేఫాది పదములను అఱువరుసలు చేయుటకన్న మూఁడే వరుసలు చేయుట మిక్కిలి మేలు. దంత్యచిహ్నముచేతను రూపభేదముచేతను భేదము స్పష్టమే. ముం దొకవరుసయందు వెదకి అందుఁ గానక ఇతరమందు వెదకు కాలహరణము తొలఁగును. తెలివిడి - 'చాపల్యము' వెంబడినే 'చేమ' రావలయును. అట్లే 'రిక్క' వెంబడినే 'ఱిక్క' రావలయును.

## XI హూణభాషానుప్రవేశము.

ఈనిఘంటువునందు అర్థవ్యుత్పత్త్యాదినిర్ధారణార్థమగు నాంగ్లేయభాషోద్ధారాదికములుగాక సకల పదములకు ఇంగ్లీషులో ప్రతిలేఖనమును (Transliteration), అర్థములకు ఆభాషయందు అనువాదంబును (Translation), ఆంధ్రాజ్ఞహూణజ్ఞులకు నోపయోగములే. ఐనను, వానిని మానినచో, మాననియెడల నగు కాలవేతనముద్రణాదివ్యయములలో మూఁడవపాలేనియు తగ్గును. అనఁగా 9 ఏండ్లకు కాఁదగిన గ్రంథము 6 ఏండ్ల కగును. 90 వేల రూప్యముల వేతనము 60 వేలే అగును. గ్రంథముద్రణాదికవ్యయము 15 వేలకు బదులు 10 వేలరూప్యములే అగును. ఇంక నితరవ్యయము లనేకములును కలవు గావున, [ఎట్లన—

(i) శబ్దసిద్ధి ప్రకరణమందు నిరూపితములైన విద్యలకు సంబంధించిన పదములనెల్లను,

(ii) నానామండలంబులం గల వృత్తివిశేషముల శబ్దవిశేషములను,

(iii) ఇప్పటికి వాఙ్మయగతములు గాక యాయాతావుల వ్యవహారమాత్రరూఢములై యున్న దేశ్యాది శబ్దములను, సవివరణముగా సమకూర్చుపండితులకును,

(iv) వాఙ్మయమును ఇపుడు పఠించి అనైఘంటుకపదములను వివరణములతో సమకూర్చు పండితులసంఖ్య హెచ్చినకొలంది గ్రంథనిర్మాణ కాలము తగ్గును గావున, అట్టి పండితులకు పలువురకును, వేతనములు,—

(v) గ్రంథ కోశాది పరికర సమృద్ధిచేత ఈపని సమంజసతమముగా నెఱవేఱవలయును గావున, తదర్థ బహుగ్రంథ నిష్క్రియము,—ఇత్యాద్యర్థముగా వ్యయము లనేకములు గలవు గాన.]

వానికై కొన్నివేలు చేర్చిన, 9 సం. 150 వేల రూ. లకుఁ గాఁదగినది 6 సం. 100 వేల రూ. లకు అగును. దానంజేసి ఆప్రతిలేఖనానువాదములు మానుట యొకపక్షము. నిర్ణయమునకు నిఘంటు సభవారు ప్రమాణము.

వేదము వేంకటరాయశాస్త్రి.

## శాస్త్రులవారి విమర్శలు-ఉపన్యాసములు.

గ్రామ్యభాషాప్రయోగనిబంధనము. (నాటకగ్రామ్యము) 0 12

ఆంధ్రప్రసన్నరాఘవనాటకవిమర్శ. 2 0

విమర్శవినోదము. కతిపయ సంస్కృతాంధ్రకావ్య నాటకాది విషయకము. 0 12

తిక్కన సోమయాజివిజయము. 0 8

విసంధివివేకము. 0 2

భారతాభారతరూపకమర్యాదలు. మన నాటకముల మర్యాదలను ఇంగ్లీషునాటకములతీరును పోల్చివ్రాయుచు నాట్యకళ నెట్లభివృద్ధి చేయదగునని శాస్త్రులవారు కావించిన యుపన్యాసము. వారియనుభవమును సయితము తెలిపియున్నారు. (భరత+షేక్స్పియర్. నాట్యకళాచరిత్ర. 0 4

ఆంధ్రగ్రంథవిమర్శనప్రకారలేశము, తెనుఁగుపుస్తకముల నెట్లు విమర్శింపవలయుననుటనుగూర్చినది. 0 4

గ్రామ్యాదేశనిరసనము. గ్రామ్యగ్రాంథికవాదమును గుఱించినది. ఈ వ్యాసములో శాస్త్రులవారు ఆంధ్రదేశమందలి అన్నిజిల్లాల గ్రామ్యములను వర్ణించియున్నారు. కడుపుబ్బనవ్వించు విమర్శ. 0 4

[శ్లేషవినోదము, ఆంధ్రమున స్వరసంధ్యాది యతిప్రాసలు, ఆంధ్రమున కవనకళాపరిణామము] అచ్చులోనున్నవి.

స్త్రీపునర్వివాహ దుర్వాదనిర్వాపణము. 1 0

ఆంధ్రహితోపదేశచంపువు. చిన్నతరగతులయందలి బాలురకును బాలికలకును సులువుగా బోధయగునట్టిశైలిలో సంస్కృతహితోపదేశమునకు గద్యపద్యములుగా శ్రీ శాస్త్రులవారు కావించిన యాంధ్రానువాదము. 1 4

వే. వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4 మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీథి, జి. టి. మదరాసు.

# వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4, మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీధి, జి. టి. మదరాసు.

ఆర్డరుతోకూడ సగముసొమ్ము అడ్వాన్సు పంపవలెను.

(తపాలుచార్జి ప్రత్యేకము.)

## సంస్కృత గ్రంథములు.

మేఘసందేశము. మల్లినాథ వ్యాఖ్య - తెనుఁగున ప్రతిపద టీకా తాత్పర్యపదప్రయోజనచర్చ-ఆక్షేపసమాధానములు. సంస్కృత మారంభించువారు ఈ తెనుఁగు సంపూర్ణటీక చేత దీనిని చదివి సులువుగా రసముగ్రహించి సాహిత్యము పొందవచ్చును. రు. 2 8

రఘువంశము మల్లినాథవ్యాఖ్య - తెనుఁగు ప్రతిపద టీకా తాత్పర్యములు. ఎల్లవారును స్వయముగా పఠించి సంస్కృతమందు సాహిత్య మలవరుచుకొనుటకు ఉత్తమసాధనము. మొదటి 6 సర్గలు 3 0

కుమారసంభవము, 6 సర్గలు, పైదానివలెనే టీక. 3 0

నైషధము. ,, ,, అచ్చగుచున్నది.

అమరుకావ్యము. శృంగారలక్ష్యము. వేమభూపాల సంస్కృత వ్యాఖ్య. సంపూర్ణాంధ్రటీకయు. అచ్చగుచున్నది. 1 8

పుష్పబాణవిలాసము. సంస్కృతవ్యాఖ్య. తెనుఁగు పూర్ణటీక. 0 8

హితోపదేశము, మూలము 0

తెనుఁగు తర్జుమా, టీకలతో 12

పంచతంత్రము, మూలము 8

దశకుమారచరిత్రము ,, 0

,, తెనుగు సటీకా తాత్పర్యము (అచ్చగు) 2 8

విక్రమార్కచరిత్రము, వచనము, టీకతో (అచ్చగుచున్నది)

భోజచరిత్రము, సులువైనశైలి, పైదానివలెనేటీక. ,,

వ్రతకల్పవల్లి (6 వ్రతములు) 1 12

అభిజ్ఞానశాకుంతలము, తెనుఁగువ్యాఖ్యతో అచ్చగుచున్నది.

బిల్హణచరిత్రము, తెనుగు పూర్ణటీక. (అచ్చగుచున్నది)

రసమంజరి, శృంగార రస స్వరూపవిస్తరము, సటీక. 1 8

ప్రియదర్శికానాటిక, శ్రీహర్షకృతి సంస్కృతటిప్పణము
గద్య పద్యములుగా ఆంధ్రీకరణము సహితము. 1 8

శబ్దమంజరీ సమాసకుసుమావళీ లింగమంజరులు. 0 8

## ఆంధ్ర గ్రంథములు.

### పద్యకావ్యములు.

ఆముక్తమాల్యద సంజీవనీవ్యాఖ్య. 12 0

శృంగారనైషధము సర్వంకషావ్యాఖ్య (అచ్చగుచున్నది)

విజయవిలాసము, చేమకూర వేంకటరాజు. టీకాసహితము

సారంగధరచరిత్రము ,, ,,

జ్ఞానవాసిష్ఠరామాయణము, వేదాంతము, మడికిసింగనకృతి 1 8

ఆంధ్రబిల్హణీయము, నిర్దోషము 0 8

పారిజాతాపహరణము, మూలము 0 8

(అచ్చగుచున్నది)

సారంగధరచరిత్ర, ద్విపద (కవి విశ్వకర్మమతస్థుఁడు) 0 8

హరిశ్చంద్ర, ద్విపద, గౌరనమంత్రి ప్రణీతము 1 0

మనుచరిత్రము, సటీక (అచ్చగుచున్నది)

నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగడ, సటీక (అచ్చగుచున్నది)

### నాటకములు.

ప్రతాపరుద్రీయనాటకము, సటిప్పణము, క్రౌనుసైజు 2 0

బొబ్బిలియుద్ధనాటకము 1 4

ఉషానాటకము, సటిప్పణము, క్రౌనుసైజు 1 4

శాకుంతలనాటకము, కాళిదాసీయమునకు తెనుఁగు 1 0

విక్రమోర్వశీయనాటకము, Inter Text నోట్సుతో 2 0

మాళవికాగ్నిమిత్రనాటకము 0 12

నాగానందనాటకము 1 0

| | | |
|---|---|---|
| రత్నావళీనాటిక, శ్రీ ధరణికోట వేంకటసుబ్బయ్యగారివ్యాఖ్యతో | 1 | 4 |
| ప్రియదర్శికానాటిక | 0 | 8 |
| ఉత్తరరామచరిత్ర నాటకము—విపులమగు పీఠికతో | 1 | 8 |
| | 0 | 8 |

## సులభ వచనగ్రంథములు.

| | | |
|---|---|---|
| హితోపదేశకథలు, నీతిబోధకములు, (అచ్చగుచున్నది) | 0 | 8 |
| భోజ కాళిదాసకథలు, రసభరితములు వెలువడనున్నవి. | 0 | 12 |
| బేతాళ పంచవింశతిక | 0 | 12 |
| భేతాళుని యద్భుతకథలు, ప్రజ్ఞ కలిగించునవి (అచ్చులో) | 0 | 10 |
| విక్రమార్కుని యద్భుతకథలు, గుణము కలిగించునవి | 0 | 12 |
| కథాసరిత్సాగరము, అద్భుతనీతి వ్యవహారకథలు, ఆఱుభాగములు | 12 | 0 |
| ఒక్కొకభాగము ప్రత్యేకముగా | 2 | 0 |
| దశకుమారచరిత్ర, కథలు | 1 | 0 |

## లక్షణగ్రంథములు.

| | | |
|---|---|---|
| ఆంధ్రసాహిత్యదర్పణము, విశ్వనాథకవిరాజకృత సంస్కృతగ్రంథమునకు సరియైన యాంధ్రానువాదము. మూలమునందలి ఉదాహరణశ్లోకములతో చేర్చి ముద్రించితిమి ఇందు నాటకలక్షణము సంపూర్ణముగా కలదు. | 5 | 0 |
| కావ్యాలంకారచూడామణి తొమ్మిది ఉల్లాసములును పూర్తిగా | 1 | 4 |
| అలంకారసంగ్రహము | 0 | 12 |
| ఛందస్సు, విద్యార్థుల కుపయోగము, సంగ్రహము | 0 | 4 |
| కుమారదేవపండితీయము, ప్రౌఢవ్యాకరణవ్యాఖ్య | 2 | 8 |
| అర్థానుస్వారతత్త్వము | (అచ్చగుచున్నది) | |

## శారదాకాంచికలు - విమర్శలు - ఉపన్యాసములు.

జక్కన విక్రమార్కచరిత్ర ముద్రణవిమర్శనము 1 కింకిణి(అచ్చగుచున్నది)

ఆంధ్రప్రసన్నరాఘవనాటకవిమర్శ 2 కింకిణి

కాళహస్తీమాహాత్మ్య ముద్రణవిమర్శనము 3 కింకిణి(అచ్చగుచున్నది)

గ్రామ్యభాషా ప్రయోగనిబంధనము, (పాత్రోచిత
భాషనుగుఱించినది) 4 కింకిణి 0 12

మోచాకుసుమామోదవిచారము 5 కింకిణి

ఆంధ్రవ్యాకరణ సర్వస్వవిమర్శనము 6 కింకిణి ,,

విమర్శవినోదము, సంస్కృతాంధ్ర కావ్యనాటకాది విషయకము 0 12

తిక్కన సోమయాజివిజయము 0 12

విసంధివివేకము 0 2

భారతాభారతరూపకమర్యాదలు, (నాట్యకళాచరిత్రము) 0 6

ఆంధ్రగ్రంథవిమర్శన ప్రకారలేశము, తెనుఁగుపుస్తకముల నెట్లు
విమర్శింపవలయుననుటను గూర్చినది. 0 6

గ్రామ్యాదేశనిరసనము, గ్రామ్యగ్రాంథికవాదమును గుఱించినది.
ఈవ్యాసములో శాస్త్రులవారు ఆంధ్రదేశమందలి అన్నిజిల్లాల
గ్రామ్యములను వర్ణించియున్నారు. కడు ప్రుబ్బనవ్వించువిమర్శ 0 6

స్త్రీపునర్వివాహగ్రంథము 1 0

ఆంధ్ర హితోపదేశచంపువు, గద్యపద్యాత్మకము 1 4

ఆంధ్రభాషాసర్వస్వార్హనియమకతిపయములు (నిఘంటురచనావిధి) 0 4

వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితచరిత్రసంగ్రహము—
25 ప్రకరణములు. సులువైనశైలి శాస్త్రులవారిహాస్యము,
విమర్శలు, విద్యావినోదములు, సుఖదుఃఖములు, సమకాలిక
పండితవిమర్శలు మొదలైన యనేకవిశేషములు గలవు. శ్రీ
డాక్టరు, సర్, కట్టమంచి రామలింగారెడ్డి గారి 'గురుపూజ'
యను నుపన్యాసముతో నలంకృతము 1 8

A HAND-BOOK OF CLASSICAL SAMSKRIT LITERATURE, By Sri U. Venkatakrishna Rao, M. A. for college students. Questions also given. Rs. 2 0